చిత్రాంగి : మాలతీ ! నువ్వు ఎంత మంచిదానివి; ఎంత యోగ్యురాలివి. ఎంత అదృష్టవంతురాలివి ! నిన్ను మనసారా ప్రేమించిన భర్త, నీ పుట్టింటికే వచ్చాడు. అత్తింట అడుగు మోపని దానివి, మూరకష్టాలు నీకెలా తెలుస్తాయి, చెప్పు !

మల్లిక : ఇందులో రాజకుమారికకు కష్టం ఏముంది ! పుట్టింటివారికంటె, అత్తవారు మరీ గొప్పవారు. తండ్రి ప్రభువు; భర్త, ప్రభువులకు ప్రభువు. ఇటు పుట్టింటివారు, అటు అత్తింటివారు, నిన్ను కంటికి రెప్పవలె కాపాడుతూ వుంటే అలా దిగులుపడతా వేమిటి, రాజకుమారికా! ఎంతోమంది దాస దాసీలు, స్నేహితులు, నీతో అరణం వస్తున్నపుడు, ఒంటరిదాని వయిపోతావని బెంగెందుకు నీకు ?

చిత్రాంగి : మాలతీ! నువ్వు నాతో వస్తావుకదూ ?

మాలతి : నీకంటె ఈజీవితంలో నాకింకెవరున్నారు తల్లీ! ప్రభువుల శెలవు పుచ్చుకుని, నీతోనే వుంటాను !

మీనాక్షి : అదంతా పిలువడుతుంది, రాజకుమారికా ! ఆమె మగడులేనిదే, ప్రభువులకు ఒక్క నిముషం గడవదుకదా ! నీతో, వాళ్ళని ఎలా పంపిస్తారు చెప్పు !

• • •

ఉద్యానవనములో ఒక మందిరము. చక్కగా అలంకరించిన పూజామంటపము. ఛత్రము కింద పీఠముపై అమర్చిన దుర్గ విగ్రహము. ప్రేక్షకులకు ఎదురుగ, ఎడమవైపునకు అభిముఖముగ, ఒక వెండి ఆసనముమీద, మతగురువు కూచుని వుండును. చిక్కుపడిన జుట్టు. చిసర, ముడి మోమున బొట్టు. వొంటని విభూతి. చేతిలో జపమాల. పట్టుబట్టలు ధరించి సారంగధరుడు, అతని చెంత సుబుద్ధి, నారాయణ ఆసీనులయి వుందురు.

గురుడు: పూర్వజన్మసంస్కారం లేనివారికి సత్యము తెలుసుకొనే అర్హత లేదు. సామాన్యమానవులకు అది అగపడదు. సత్యము గుంపుకు దూరం. అల్పమైన నమ్మకాలతో కొట్టుకుంటున్న జనులకు, అది జుగుప్సాకరముగా తోస్తుంది. జడునకు అది అందని ఫలం. కించిదజ్ఞులు, అల్పదేవతలు కల్పించిన ధర్మాలు నామమాత్రమైనవి. మహాధర్మం వాటిని పాటించదు. అటువంటి మహాధర్మాన్ని మీరు అవగతము చేసుకోవాలనుకుంటే, రాజకుమార! ఇటు వినండి!

సారంగధరుడు: జ్ఞానముకంటె ఆనందదాయకమైనది నాకింకొకటి లేదు. మహాజ్ఞానమే నాకు పరమానందము.

గురుడు: మంచిది రాజకుమార! ప్రతి మాటను జిజ్ఞాసతో వినండి! మాతృస్తన్యముతోపాటు అనూచానముగా, అలవడుతున్న నైతిక భావాలను లక్ష్యపెట్టవద్దని, తృణీకరించమని, ఈ మత శాఖ,మీకు బోధపరుస్తున్నది·సామాన్య నైతికసూత్రాలు దేనిని పాపమని ఖండిస్తున్నవో, దానిని ఇది ఉత్కృష్టమని భావిస్తుంది; వాటికి ఏది నిషిద్ధమో, అది దీనికి అవలంబనీయం; శిరోధార్యం. సత్యములలోకల్లా మహాసత్యం ఇదే· రహస్యములలోకల్లా పరమరహస్యము ఇంతే. మీరు జీవితమునకు మూలమైన స్త్రీని ప్రేమించవలె; స్త్రీని, మీరు, జీవితమును ప్రేమించినట్లు కాక, ఆమెలోని, దైవమును ఆరాధించవలె. స్త్రీని ఆరాధిస్తున్న కొద్దీ, వెలుగొందే జీవనజ్యోతితో మీ ఆత్మను మీరు తేజోవంతం చేసుకోవచ్చును.

---

* ఇది చిత్రాంగి అనే, ఈ నాటకమునకు మొదటి అంకము: ఒకటవ రంగము.

సారంగధరుడు : సరే;

గురువు : మంచీ చెడూ అనేవి ఎక్కడాలేవు. అంతా మిథ్య. లోకం ఒక భ్రాంతి. మీరు జీవించక తప్పదు కనక, జీవిస్తున్నంత కాలం, ఆ భ్రాంతిని ప్రకాశవంతం చేసుకోక తప్పదు. మీరు గతించినప్పుడు, విశ్వమంతటా వ్యాపించివున్న శక్తిలో లీనం కావలసి వుంటుంది. శక్తి అంటే ఏమిటి? స్త్రీ! మధువు! విజ్ఞత వున్నవారికి అవి జీవితం. లేనివారికి అవే మరణం.

సుబుద్ధి : అయితే ఈ లోకంలో దుర్గ, ఏమిటి ఇస్తుంది?

గురువు : దుర్గను ఆరాధించిన రాజకుమారుడు చక్రవర్తి కాగలడు!

సుబుద్ధి : [రాజకుమారుని చెవిలో] పాపం! మనం చేస్తున్నది ఆయనకి అర్థం కాలేదు; మనల్ని తన మతంలో ముడిపెట్టి ఏమిటో బోధిస్తున్నాడు. *

---

*శివశక్త్యై ఇత్యాది శ్లోకములను ఇక్కడ వ్రాయవలెనని మహాకవి నోటు చేసుకున్నారు.

